## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ ఆషాఢ శు॥ దశమి
1954 సం॥ జూలై 10 శనివారం
శ॥ దశమి 24-47 స్వాతి 16-13 వర్జ్యం 21-27 ల 26-14 కు.
శు॥ ఏకాదశి జూలై 11 ఆదివారం
ఆ॥ ఏకాదశి రా2-48 విశా17-56వర్జ్యం 22-19 ల 24-5 కు.

ఆంధ్రపత్రిక

ఓరు శేయుని యొంజరించిన నరవని యశ్రియము తన కుసంబున నగు బా వొదులకు నవిసేయుదునికి వరాయణము భరమధర్మభవములెల్లన్.-(మహాభారతము)

శ్రీ జయ సం॥ ఆషాఢ శు॥ దశమి
శనివారం

## భాక్రా-నంగల్ ప్రాజెక్టు

భారతదేశం స్వతంత్రమై ఏడుసంవత్సరాలైనది. ఈ ఏడేండ్లలో నూభారతప్రభుత్వం సాధించిన విజయాలు గణనీయములు కాదనగలవారుండరు. అన్నిరంగములలోనూ దేశమును స్వయం సమృద్ధము, స్వయంపోషకము చేయడానికి కేంద్రప్రభుత్వం ఏడేండ్లక్రితం ప్రారంభించిన కృషి ఫలితాలు ఇప్పుడిప్పుడే అనుభవానికి వస్తున్నవి. దేశం స్వతంత్రమైన తర్వాత దేశంలో ఆర్థిక సాంఘిక పరిస్థితులు అధ్వాన్నమైనట్లు ప్రచారం చేస్తున్నవారు మన దేశంలోనూ, ఇతరదేశాల్లోనూ కొందరు లేకపోలేదు. వీరందరికీ ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ భాక్రా-నాంగల్ ప్రాజెక్టు కాల్వలకు ప్రారంభోత్సవం చేసిన సందర్భమున సమాధానమిచ్చారు. ఈ ఏడు సంవత్సరాలలోనూ ప్రజల ఆర్థికస్థితిలో ఎన్నతగినంత అభివృద్ధి కన్పించకపోవచ్చును. ప్రజల జీవన ప్రమాణంలో ఆశించినంత అభివృద్ధి లేకపోవచ్చును. అయితే ఈ ఆశయాలు, ఈ లక్ష్యాలు సిద్ధించడానికి అవసరమైనకార్యక్రమాలను, నిర్మాణాలను చాలావరకు భారతప్రభుత్వం పూర్తిచేసిందని చెప్పవచ్చును.

ప్రధానమంత్రివివరించినట్లు స్వతంత్ర భారతదేశ పౌరుల కార్యదక్షతకు, నిర్మాణశక్తికి చిత్తరంజన్‌లోని రైలు ఇంజన్ల నిర్మాణశాల, సింద్రీలోని ఎరువుల ఫాక్టరీ, బెంగుళూరులోని విమాన నిర్మాణశాల, టెలిఫోన్ల ఫాక్టరీ, పెరంబూరులోని రైలు పెట్టెల ఫాక్టరీలేగాక తుంగభద్రా ప్రాజెక్టు, భక్రా-నంగల్ ప్రాజెక్టు, దామోదర లోయ అభివృద్ధి ప్రాజెక్టు అన్నీ కూడా చిహ్నములే. భక్రా-నంగల్ ప్రాజెక్టువల్ల దాదాపుముప్పయిలక్షల ఎకరాలకు సాగుసౌకర్యాలు లభిస్తవి. గత రెండేండ్లలోనూ మన ఆహారకొరత తీరిపోవడమేగాక, కొంత మిగులుకూడా ఏర్పడింది, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిన నీటిపారుదల ప్రాజెక్టులన్నీ పూర్తి అయి, ఆ ప్రాజెక్టుక్రింది భూములన్నీ సాగులోకివస్తే భారతదేశం ప్రపంచానికే ధాన్యాగారం కాగలదు.

దేశంలో ఇంతటి మహత్తర నిర్మాణాలు జరుగుతూవున్నప్పటికీనీ, ఒక ప్రాంతంలో జరుగుతున్న పనిని గురించి ఇతర ప్రాంతాలలో వున్న ప్రజలకు తెలియనందువల్ల ప్రజాసామాన్యంలో ఉత్సాహం, ఆశాభావం అంతగా కన్పించక పోవడంలేదు. పండిట్ నెహ్రూ ఉద్ఘాటించినట్లు నేలాది పనివారల నైపుణ్యం, కాయకష్టం, కార్యదక్షతతో ఏర్పడిన ఈ నిర్మాణాలు ఆరాధింపతగినవి. ఈప్రదేశాలు తీర్థక్షేత్రాలు కావాలి. అందుకు రైల్వే అధికారులు తగిన ఏర్పాట్లు చేయాలి నామమాత్రపు ప్రయాణచార్జీలు వసూలుచేసి ఈ ఆధునిక శిల్పకళాఖండాలను చూచేందుకు ప్రజలకు సౌకర్యాలు కల్పించాలి.

భాక్రా-నంగల్ ప్రాజెక్టు నిర్మాణాన్ని కొనసాగకుండా చేయడానికి పాకిస్థాన్ ఎన్నో ప్రతిబంధకాలను కల్పించింది. పాకిస్థాన్‌లో నుంచి ప్రవహించే నదులజలాన్ని, పాకిస్థాన్ అవసరాలు తీరకపూర్వం భారతదేశం వినియోగించుకోరాదని పాకిస్తాన్ అధిక్షేపిస్తూ వచ్చింది. ఈ తగాదాపై ప్రపంచబ్యాంకు అన్ని విషయాలనూ విచారించి తీర్పు ఇచ్చినది. ఆ తీర్పును 'భారతప్రభుత్వం అంగీకరించగా, పాకిస్థాన్ ప్రభుత్వంనిరాకరించింది. పాకిస్తాన్ పంజాబ్ నదీ జలాలను వినియోగించుకు నేవరకూ భారతదేశం ఈ నీటిని వినియోగించుకోరాదనేవాదనను అంగీకరిస్తే, ఆ ప్రకారం సట్లెజ్ నదీ జల వినియోగం ఎన్నిదశాబ్దాలకు సాధ్యమౌతుందో కూడా ఊహింపలేము. పాకిస్థాన్‌లో సాగుకు నీటి కొరత అనేది లేకుండా చేయగలమని భారత ప్రభుత్వం పాకిస్థాన్‌కు ఎన్నో పర్యాయములు హామీ ఇచ్చినది. ఆ హామీనే ప్రధానమంత్రి తిరిగి మొన్న భాక్రా - నంగాల్ ప్రాజెక్టు కాల్వలకు ప్రారంభోత్సవం చేసిన సందర్భంలో పునరుద్ఘాటించారు. 1948 వ సంవత్సరంలో భారత - పాకిస్థాన్ ప్రభుత్వాలు చేసుకున్న పంజాబ్ కాల్వల నీటి ఒప్పందానికి భారతప్రభుత్వం ఇప్పటికీ కట్టుబడేవున్నదని కూడా ప్రధానమంత్రి స్పష్టంచేశారు. పాకిస్థాన్ నిర్మింపదలచుకున్న ప్రాజెక్టులకు కొంత ఆర్థికసహాయం చేయడానికి కూడా భారతప్రభుత్వం సిద్ధంగా వున్నది. అయినా పాకిస్థాన్ సమాధానానికి రావడానికి సుముఖంగా లేదు. ఈ స్థితిలో అవకాశము, హక్కువున్నంతవరకు పంజాబ్ నదీ జలాలను వినియోగించుకోవడం కంటే భారతదేశం చేయుకల్గిందేమీ లేదు.

## డాం నిర్మాతలకు నెహ్రూ జోహార్లు

నంగాల్, జూలై 8: భక్రా డాం నిర్మాతలైన ఇంజనీరు, టెక్నీషియన్లు, కార్మికులకు నెహ్రూ జోహార్లర్పించారు. సర్వ శ్రమలూపడి వారుచేసిన కృషిఫలితమే ఇది అని అంటూ, కృషి నిర్వహణలో విశిష్టత చూపినవారికి బహుమతులు పంచిపెట్టారు.

గడచిన నాలుగేండ్లలో ఈ డాము నిర్మాణంలో 60 మంది కార్మికులు మృతినొందారు. వారి స్మృతిచిహ్నంగా శిలఫలకాన్ని నెహ్రూ ఆవిష్కరించారు. పంజాబుప్రభుత్వం ఇవ్వాళ రాష్ట్రమంతటా సెలవు ప్రకటించింది.

## భక్రా కాల్వలవల్ల కలిగే ఫలితాలు

నంగాల్, జూలై 8. నేడు ప్రారంభోత్సవం జరిగిన భక్రాకాల్వలవల్ల పంజాబులో ఇకనిమీదట సాలీనా 7.5 లక్షల టన్నుల ఆహారధాన్యాలూ, 9.5 లక్షల టన్నుల పశుగ్రాసమూ, 5.25 లక్షల పత్తి అధికంగా పండుతాయి. 30 కొత్తమండీలు(మార్కెట్లు) ఏర్పడి 9 లక్షల బస్తీప్రజలకు పనికలుగుతుంది. ఈ కాలువలవల్ల దాదాపు 20 లక్షల గ్రామీణులకు ప్రయోజనాలు కలుగుతాయి. 4 లక్షల కిలోవాట్ల విద్యుత్తు ఉత్పత్తి అవుతుంది.

## భారతదేశం సదా స్వతంత్రంగానే వ్యవహరిస్తుంది

### —ప్రధాని నెహ్రూ ఉద్ఘాటన

నంగల్, జూలై 8: "భారతదేశం ఏకూటమిలో నూ చేరదు. రెండిటికీ దూరంగానే ఉంటూ, సదా స్వతంత్రంగా వ్యవహరిస్తుంది. ఏ కొమానా సరే,-ఆది ఏకూటమికి చెందినా, సవాకరిస్తుంది. అయితే, తనకు సముచితమని తోచిన పద్ధతిలో రాజమార్గాన వ్యవహరిస్తుంది. నిజమైనస్వాతంత్ర్యం సాధించిన ఆహాకొద్ది దేశాలలో భారతదేశం ఒకటి" అని ప్రధాని నెహ్రూ ...

కమ్యూనిస్టు ... ప్రజా సోషలిస్టులు, ... ప్రభుత్వం ఏంచేస్తోందో తిరిగి చూసుకోడం అవసరం. ఏ ప్రభుత్వం అయినా సరే శాసనోల్లంఘనాన్ని సహించదు" అని ప్రధానిఅన్నారు.

వచ్చే ఏడుసంవత్సరాలలో, దేశంలోని 6 లక్షల గ్రామాలలో జాతీయ విస్తరణ ప్రణాళిక అమలు చేయాలని ...

ఆహార ఉత్పత్తివిషయంలో మనం సాధించిన అమోఘమైన విజయం ప్రపంచాన్నే విస్మయ పరచిందనీ కొంతవరకూ మననికూడా ఆశ్చర్యపరచిందనీ ప్రధానినెహ్రూ అన్నారు.

## గూఢచారులకు ఉరిశిక్ష

వాషింగ్టన్ జూలై 8: గూఢచారి పనిచేసిన వారికి ఉరి శిక్షను విధించాలన్న బిల్లును అమెరికా ప్రజా ప్రతినిధిసభ నేడు ఆమోదించింది. సెనెట్ కూడా దీన్ని ఆమోదించాలి. అందుకోసం దీన్ని సెనెట్‌కు పంపారు.

## గోవా జైళ్లలో జాతీయవాదుల యమ యాతనలు

బొంబాయి, జూలై 8: పోర్చుగీసు అధికారులు ఇటీవల అరెస్టు చేసిన గోవా జాతీయవాదులు జైళ్లలో యమ యాతనలు పడుతున్నట్లు తెలియ వచ్చింది. ఖైదీలను కటిక నేలపై పడుకో పెడుతున్నారట. సిమెంటు చేసిన ఈ సెల్సు పడుకోవటం ముఖ్యంగా ఈ వర్షాకాలంలో చాలా అనారోగ్య హేతువు. ఒకొకగదిలో 11 మందిని కుక్కారట. వీరిచేత నేరాలు ఒప్పించటానికి పోలీసులు బడితపూజా పడుతున్నారట. కోరినా కూడా వైద్య సహాయం లేదట. ఇక పెట్టే తిండి తినటానికి యోగ్యం కాదట.

గోవా డాక్టరు ...

## పోర్టోరికన్ జాతీయనాయకులకు అమెరికా శిక్ష

వాషింగ్టన్, జూలై 8: ఈ మధ్య అమెరికా ప్రజా ప్రతినిధి సభలో కాల్పులు సాగించిన పోర్టోరికన్లలో ముగ్గురికి 75 సంవత్సరాల కారావాసం శిక్షగా విధించబడింది.

నాల్గో పోర్టోరికన్ లోలిటా లెబ్రన్‌కు 10 సంవత్సరాలు మొదలు 50 సంవత్సరాల మేరకు కారావాసం విధించారు.

## పట్టణం అభివృద్ధికి శాయశక్తులా తోడ్పడండి

### కర్నూలు పౌరసమ్మాన సభలో డాక్టరు కట్జూ ఉద్బోధ

(ఆంధ్రపత్రిక విలేఖరి)

కర్నూలు,జూలై 8: "కర్నూలు ప్రస్తుతము ఆంధ్ర రాజధానిగా యేర్పాటయినందువల్ల మీరు కోరినా కోరకపోయినా పట్టణం అభివృద్ధి అయి తీరుతుంది. రాజధాని కావాలని కోరారు. వచ్చింది. ఇప్పుడు ఇంకొకటి. విశాలాంధ్ర కోరుతున్నారు. అది యే ఒక వర్గము చేతా నిర్ణయించబడే సమస్య కాదు. మీరు మీ అభిప్రాయము చెప్పారు. మరొకరు వారి అభిప్రాయము చెప్పవచ్చును. వానిని రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం పరిశీలించి, ప్రభుత్వానికి సిఫార్సులు చేస్తుంది. ఇంకా ప్రభుత్వం నిర్ణయం ...

... ఇబ్బందిపడలేదు కదా? అదీకాక చూడడానికి వచ్చేవారికి త్రాగేందుకు నీళ్ళులేవని చెప్పి ముందుగా కాలవను చూపించరుకదా? నేనే కర్నూలు వాసిని అయిన రాజధానిని ఇక్కడినుంచి కదల్చుటకు మతరాము అంగీకరించను.

"ఇప్పుడు ఇంకొక కోరికవచ్చింది. విశాలాంధ్ర నిర్మాణము కోరుతున్నారు. అది ఒక వర్గముచేత నిర్ణయించబడే సమస్యకాదు. మీరు మీ అభిప్రాయము చెప్పారు. మరొకరు వారి అభిప్రాయము చెప్పవచ్చును. దీనిని రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం పరిశీ...

## "దేశ ఐక్యతని భగ్నం చేసేవిధంగా ప్రవర్తించకండి"

### సరిహద్దు తగాదా ఉద్యమాలలో పాల్గొనడం గర్హిస్తూ కాంగ్రెస్ వాదులకు నెహ్రూ లేఖ

న్యూఢిల్లీ, జూలై 8: నూతనరాష్ట్రాలు ఏర్పరచవలసిందనీ, ఇదా ఇప్పటి రాష్ట్రాల సరిహద్దులు మార్చవలసిందనీ ఆందోళనచేస్తూ ఉద్యమాలు జరపడానికి కాంగ్రెసు సభ్యులు ముందుకు ఉరకడాన్ని గర్హిస్తూ,ప్రధాని నెహ్రూ ప్రదేశ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులకు ఒక లేఖ వ్రాశారు.

"రాష్ట్రపునర్వ్యవస్థీకరణ సమస్య ...

... ప్రధాని నెహ్రూ యీ లేఖలో హెచ్చరించారు.

రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘానికి తమ తమ అభిప్రాయాలు తెలియ చేయడానికి కాంగ్రెసు సభ్యులకు అవకాశమిస్తూ హైదరాబాద్ కాంగ్రెసు సమావేశంలో తీర్మానం చేయబడింది. కార్యవర్గ ఆదేశాలుకూడా ఎంతో స్వేచ్ఛనిచ్చాయి. దీన్ని పురస్కరించుకుని దేశపౌని రభస జరపవద్దనీ, దేశ ఐక్యతకు, ప్రతిష్ఠకూ భంగంచేసే పనులు తలపెట్టవద్దనీ, కాంగ్రెసు ఆ సభ్యులను అర్థించడం జరిగిందనీ ప్రధాని యీ లేఖలో గుర్తుకు తెచ్చారు.

ప్రధానిలేఖ ఈ విధంగా ఉంది.

ప్రియసోదరా! నా మనస్సుని ఎంతగానో కలవర పెడుతున్న ఒక ముఖ్య విషయం గురించి చెప్పడానికి ఈ లేఖ వ్రాస్తున్నాను. కొత్తరాష్ట్రాలు కావాలనో, లేదా ఇప్పటి రాష్ట్రాల సరిహద్దులు మార్చాలనో, జరుగుతున్న ఆందోళన నానాటికీ విస్తరిస్తున్నది. అసలు ఈ సమస్యలో ఉండే సాధక బాధకాలు ఇదివరకే మేము గ్రహించాం. కొన్ని సంవత్సరాలుగా దీన్ని గురించి ఆలోచిస్తున్నాం. భాష, సంస్కృతుల దృష్ట్యానే కాక, దేశ ఐక్యత, పురోభివృద్ధి గురించికూడా ఈ సమస్యను వీక్షించి పరిష్కరించాలని హైదరాబాద్ సమావేశంలో తీర్మానంచేశాం.

దరిమిలాను రాష్ట్ర పునర్వ్యవస్థీకరణకై ఉన్నతాధికారాలతో ఒక ప్రత్యేక సంఘం నెలకొల్పబడింది. ఈ సంఘానికి కాంగ్రెసుసభ్యులు ఏ విధంగా తమ అభిప్రాయాలు తెలియచేయాలో కాంగ్రెసు కార్యవర్గం ఆదేశించింది. వ్యక్తిగతంగా గాని, సమిష్టిగా గాని ఆ సంఘానికి అభిప్రాయాలు నివేదించడానికి సువిస్తృత అవకాశాలు ఇవ్వబడ్డాయి. ఒక సంఘంలోని సభ్యులకు విభిన్నాభిప్రాయాలు ఉంటే, మైనారిటీ వర్గంవారు కూడా యథేచ్ఛగా అభిప్రాయాలు వివరించడానికి అవకాశం ఇవ్వబడింది. అయితే ఈ సమస్యపై కాంగ్రెసు సభ్యులు బహిరంగ ఆందోళనలు జరపవద్దని కాంగ్రెసు అర్థించింది. యీ సమస్యని ప్రశాంతంగా, నిర్వికారంగా పరిష్కరించడం అవసరమని విశదీకరించింది.

#### ఉల్లంఘన

కార్యవర్గం జారీచేసిన ఈ ఉత్తరువులను కాంగ్రెసు సభ్యులు పాటించకపోవడం సంతాపకరమైనవిషయం. కొందరు సభ్యులు అతితీవ్రంగా ఆందోళన జరిపారు.

అసలు యీ రాష్ట్ర వ్యవస్థీకరణ సమస్య ఎక్కువభాగం దక్షిణ భారతానిది. కాని ఈనాడు ఇది దేశం అంతటా వ్యాపించింది. అందరికీ అంటుకుంది.

ఈనాడు వినవచ్చే కోరికలు రకరకాలు కొన్నికొన్ని అత్యాశ్చర్యకరమైనవి. ఎవరి మట్టుకు వారు మహాతీవ్రంగా పోటీపడుతున్నారు. ...

... రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సక్రమంగా జరగడానికి మనం వ్యతిరేకులం కాము.

అయితే ఈనాడు ఈ సమస్యపై అనేక ప్రాంతాలలో జరుగుతున్న ఆందోళనలకు, అనుసరించబడుతున్న ఈ విధానాలకూ మనం పూర్తిగా వ్యతిరేకులం.

ఈ ఆందోళనలూ కొన్నిచోట్ల నిజంగా అర్థవంతాయి. కొన్ని కృత్రిమంగా జరుపబడుతున్నవి.

ఏదేమైనా ఒక భారతీయుడికీ, మరొక భారతీయుడికీ, ఒక రాష్ట్రానికీ మరొక రాష్ట్రానికీ వైమనస్యం కలిగించే విషయాలకు, దేశ ఐక్యతను భగ్నంచేసే విధానాలకు మనం పూర్తిగా వ్యతిరేకులం. కాంగ్రెసు సభ్యులుగా, మన సంస్థను బలహీన పరచే ఏ పనికైనా వ్యతిరేకులమే.

అందువల్ల, ఈ ఆందోళనలలోనూ, ఈ ఉద్యమాలలోనూ, కనీసం కాంగ్రెసు సభ్యులైనా పాల్గొనకుండా చేయవలసిందని నేను కోరుతున్నాను.

దేశానికి అరిష్టమైనపనులు జరుగుతూఉండగా, మనం ఉదాసీనులుగా ఉండలేము.

## సంప్రతింపులకై ఫ్రాన్సు అభ్యర్థన

### భారత ప్రభుత్వానికి అందచేసిన వైనం

పారిస్, జూలై 8: భారతదేశంలో ఇంకా తమ ఆధీనంలోవున్న ప్రదేశాల గురించి సంప్రతింపులు పునః ప్రారంభించాలన్న ఫ్రాన్సు అభ్యర్థన మామూలు రాజ్యతంత్ర మార్గంలో భారత ప్రభుత్వానికి అందచేయబడిందని ఇవ్వాళ తెలిసింది. ఫ్రెంచివారి అభ్యర్థన సంప్రతింపులు పునః ప్రారంభించాలన్న వారి అభిలాష నే తెలుపుతున్నదిగాని అందులో కొత్త ప్రతిపాదనలేమీ లేదని అధికార వర్గాలద్వారా తెలిసింది.

## ఫ్రెంచిండియాలో పోలీసు బలగం పెంపు

కారైక్కాల్, జూలై 8: ఫ్రెంచిండియా పోలీసు బలగాన్ని పెంచేందుకై వీలైనంతమందిని అదనంగా చేర్చుకోవాలనీ, ఇది తాత్కాలిక ఏర్పాటేననీ ఫ్రెంచిఇండియా కమీషనరు తమ కమాండెంట్‌కి అధికారమిచ్చారు.

## పోలీసు జులుం

బాహూరు కమ్యూనుకు చెందిన సోనియం కుప్పంలో గతరాత్రి ఫ్రెంచి సాయుధ అశ్విక పోలీసులు, సైనికులు ఇళ్ళల్లో జొరబడి స్త్రీ, పురుష, బాలవిచక్షణ లేకుండా బాది వొదిలిపెట్టారట. ఇదంతా ఈ గ్రామస్థులు ఇటీవల ఆర్. చాడిల ఉపన్యసించిన బహిరంగ సభకు వెళ్లి వచ్చినందుకే ఇట్లా 60 మందిని కొట్టి, తాళ్ళతో కట్టి మైలున్నర దూరాన వున్న బహూరుకు ఈడ్చుకుపోయి ఆ రాత్రి ల్లా ఒక ఇంట్లో పెట్టి తాళం వేసి, తెల్లవారాక, ఇంకెప్పుడూ విలీనానుకూల సభలకు వెళ్ళవద్దనీ, విలీనం గురించిగానీ, సత్యాగ్రహం గురించి గానీ, భారత జెండా గురించిగానీ మాట్లాడరాదనీ బెదిరించి పంపివేశారట. కరువినాథన్ అనే గ్రామంలో కూడా పోలీసులు ఇదే విధంగా దౌర్జన్యాలు జరిపినట్లు తెలిసింది. ప్రజలు భయకంపితులు అయిపోతున్నారట.

## రాజభవనం వార్తలు

కర్నూలు, జూలై 8: ఆంధ్ర రాష్ట్ర రెడ్‌క్రాస్ సంఘానికి కార్యదర్శిని ఎన్నుకొనడానికి ఏర్పాటు చేయబడిన రాష్ట్ర రెడ్‌క్రాస్ సంఘం సమావేశానికి శ్రీమతి కుసుమ త్రివేది గారు అధ్యక్షత వహించారు.

* * *

ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ మెడికల్ సర్వీసెస్ డైరక్టరు డాక్టరు ఎమ్. వి. రమణమూర్తిగారు ఈ రోజే గవర్నరుగారు కలుసుకొని మాట్లాడారు.

#### సూళ్లూరు పేటలో వర్షం

సూళ్లూరుపేట, జూలై 7: ఇక్కడ నిన్న 2 దుక్కుల వర్షం పడింది.

## సంపాదకునకు లేఖలు

### విద్యార్థుల జీతాలు

ఆర్యా, ఆంధ్రప్రభుత్వము విద్యార్థి సంఘముల కోరికపై డిసెంబరు నెలలో పరీక్షలు జరుపుటకు నిర్ణయించినందుకు విద్యార్థి లోకం ప్రభుత్వమును అభినందించు చున్నది. విద్యార్థులు జీతముల విషయములో చాలబాధపడుచున్నారు.

నెట హైస్కూళ్లలోను, కాలేజీలలోను విద్యార్థుల జీతములను కుల, మతములనుబట్టి నిర్ణయించుచున్నారు. ఈపద్ధతి విద్యార్థులకు చాల నష్టదాయకము. విద్యార్థి కుటుంబము బీదదైనను కులమునుబట్టి పెదవారగుటచేత పూర్తి ... గలరు.

... నిర్ణయములు కలిగించుచున్నది.

గొర్లపాటి వెంకటసుబ్బయ్య.

* * *

### లారీలపై పన్ను

ఆర్యా, పన్ను చెల్లింపజాలక జూలై నుండి లారీలు ఆపివేస్తున్నట్లు చిత్తూరు జిల్లా మదనపల్లినుంచి వచ్చిన వార్త పత్రికలలో ప్రచురింపబడినది. ఇంకను చాలాప్రాంతములలో లారీలు ఆపబడినవి. కృష్ణాజిల్లాలోకూడా నూరు అరవై లారీలు ఆపివేస్తున్నారు. పన్నుభారం భరించలేకనే ప్రతిచోటా ఇలా ఆపివేయడం జరుగుతున్నది.

ఎన్నిసారులు మనవిచేసికొని నను ప్రభుత్వమువారు నిర్లక్ష్యభావములో వున్నారు. ఎక్కువ ఆదాయము లుకోల్పోవకుండా వుండవలెనంటే వెంటనే కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు పన్నులను తగ్గించవలెను.

రాష్ట్రప్రభుత్వము వెంటనే సలహా సంప్రదింపులు జరిపి అంతర రాష్ట్ర పన్నులను తగ్గించే ఏర్పాటు చేయగలందులకు కోరుతున్నాము.

యద్దనపూడి రామబ్రహ్మం ప్రధాన కార్యదర్శి రాష్ట్ర లారీ యూనియన్ కాంగ్రెసు.

* * *

### కడప-కర్నూలు కాలవకింద సాగు

ఆర్యా, కడచిన రెండవకారు పంటకు (వేసవికాలపుపంట) తుంగభద్రా డాము దగ్గరయున్న అదనపు నీరు సప్లయిచేసే గ్యారంటీని ప్రభుత్వము ముందుగా రైతులకు తెలియజేయని కారణముగా మామూలుగా రెండవకారుకు నీరు చాలదనే సంప్రదాయము ప్రకారము రైతులు రెండవకారు పైరుపెట్టుటకు ఉత్సాహముచూపక, ఏకొద్దిమందో రెండవకారు పైరు వేయడం జరిగినది.

కడచిన ఏప్రెయిల్ నెల ఆఖరువరకు అదనపునీరు కె.సి. కెనాల్ వెంట ప్రవహించుతూనే యుండెను. అధికారుల లోపముల జరుగవలసిన రీతిలో యిట్టి అవకతవకలు జరుగుట చాలా శోచనీయము.

కె. సి. కెనాల్ పునర్నిర్మాణాన్ని త్వరలోనే ప్రారంభించుటకు ప్రభుత్వం సిద్ధముగాయున్నదని అందువలన వీలుగా మొదటికారుపంటకు మాత్రమే నీరుయిచ్చి రెండవకారు పైరుకు నీటిసప్లయి (పై కారణమువల్ల) యుండదని వార్తలు వస్తూయున్నవి. పై అభిప్రాయముల నిజానిజాలను ఖచ్చితముగా తేల్చి ప్రభుత్వము ముందుగానే ప్రకటించకపోతే పసుపు చెఱకు వగైరా 9 నెలల పైర్లుపెట్టి నీటికి యిబ్బందిపడడం, రెండవకారుకు అదును ఎరువు తెచ్చుకోడంలోనూ రైతాంగము వృధావ్యయప్రయాసలకు గురికావలసివస్తుంది. పై యిబ్బందులను ఆంధ్రప్రభుత్వము దృష్టిలో పెట్టుకొని రానున్న వేసవిపంటకు అదనగా రెండవకారుకు నీరు వదిలేదిలేనిది ఖచ్చితముగా వెంటనే ప్రకటించాలి.

సంతజూటూరు, వి. రామిరెడ్డి.

## ఆయుర్వేదఅభివృద్ధి విచారణసంఘాధ్యక్షుని ప్రకటన

ఆయుర్వేద వైద్య అభివృద్ధి విచారణ సంఘం అధ్యక్షులు డా॥ ఆచంట లక్ష్మీపతి గారు ఇట్లా వ్రాస్తున్నారు: "ఆయుర్వేదానికి అర్హమైన స్థానమిచ్చి గౌరవించడానికి తగు సూచనలు చేయవలసినదిగా ప్రభుత్వంవారు కోరారు. జూలై ఆఖరులోపల నివేదిక ఇవ్వవలెనన్నారు. ఈ కమిటీవారు విజయవాడలో కూర్చొని విచారణ సాగిస్తారు. విజయవాడ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాలలో జూలై 12 వ తేదీ మధ్యాహ్నం 3 గం.లకు కమిటీవారి ప్రథమ సమావేశం జరుగుతుంది.

... కమిటీ అధ్యక్షులు ... ఆయుర్వేదా... సూచనలు, సలహాలు ఇవ్వ... వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాలలో ఉండే కమిటీకి పంపవ...

# ఒరిస్సా ఆంధ్రుల భవిష్యత్

## కమిషన్‌కు నివేదిక సమర్పణ

గుణుపూర్, జులై 6: శ్రీ ప్రహరాజు పస్యాసిరాజుగారు ఇలా వ్రాస్తున్నారు: "గంజాం కోరాపుట్టి జిల్లాల భవితవ్యం గురించి జూన్ 30వ తేదీన హైదరాబాదులో ఫజల్ ఆలీ కమిషన్‌ను చూచాము. మా రాయబారి వర్గానికి శ్రీ అ. కాశేశ్వరరావుగారు నాయకత్వం వహించారు. రాయబారి వర్గంలో ఈ క్రిందివారు వున్నారు. శ్రీ అ. కాశేశ్వరరావు, శ్రీ డాక్టరు రంగాచారి, శ్రీ సర్దార్ ఉల్లాఖాన్, శ్రీ ప్ర. పస్యాసిరాజు, శ్రీ కల్వ సూర్యనారాయణగుప్త, శ్రీ రామనివాసశర్మ, శ్రీ వెంకటస్వామి, శ్రీ బి. రామిరెడ్డి; శ్రీ కాశేశ్వరరావుగారు మా అందరి తరఫున మెమొరాండం అందజేస్తూ ఆంధ్ర రాష్ట్రంలోని తెలుగు ప్రాంతం, హైదరాబాదులోని తెలంగాణా, మైసూరులోని కోలారు, ఒరిస్సాలోని గంజాం కోరాపుట్టి జిల్లాలు, మధ్యప్రదేశ్ లోని బస్తరు చాందాలు, కలిపి విశాల ఆంధ్ర రాష్ట్రం హైదరాబాదు రాజధానిగా నెలకొల్పాలని ఒక అరగంటసేపు కమిషన్‌కు నచ్చచెప్పారు.

గొప్ప విశేషం ఏమిటంటే, ఒరిస్సాలో వలెగాక హైదరాబాదులో రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ విషయంలో ఆ ప్రభుత్వంయొక్క గాని ప్రభుత్వోద్యోగులయొక్క గాని ఒత్తిడి ఏ వర్గం మీద లేదు. ప్రభుత్వం చాలా తటస్థంగా వుంది. ప్రజలంతా స్వేచ్ఛగా చెప్పుకోగలిగారు."



## దక్షిణ రైల్వే.

మన్మాడ్ రైల్వే వారి ఉత్తర్వుల ప్రకారము గూడ్సు బుకింగు ట్రాఫిక్ విషయములో దిగువ వివరింపబడిన నిబంధనలు అమలు పర్చబడుచున్నవి.

1. వీరంగం మార్గంగా మన్మాడ్ రైల్వే మీద మీటరు గేజి స్టేషనులకు.
2. సబర్మతి మార్గంగా మన్మాడ్ రైల్వే మీద మీటరు గేజి స్టేషనులకు.



# సంబూరులో మాతా శిశుసంరక్షణాలయం

## ప్లానింగుమంత్రి సంజీవయ్యగారిచే శంకుస్థాపన

సంబూరు, జులై 7: ఈ గ్రామంలో మాతా శిశు సంరక్షణాలయ భవనమునకు, ఆంధ్రరాష్ట్ర ప్లానింగుశాఖా మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారు నిన్న శంకుస్థాపన చేశారు. ఈ కార్యక్రమంలో పాల్గొనే నిమిత్తం మంత్రి సంజీవయ్యగారి వెంట జిల్లా భారత్ సేవక్ సమాజ్ కన్వీనరు డా॥ ప. వీరయ్యచౌదరిగారు, లోక్ సభ సభ్యులు శ్రీ ఎస్. వి. ఎల్. నరసింహంగారు వచ్చారు. శంకు స్థాపన స్థలములో శ్రీ శ్యామల సుబ్బారెడ్డిగారి అధ్యక్షతన సభ యేర్పాటు చేయబడింది. శ్రీ వీరయ్యచౌదరిగారు సభను ప్రారంభిస్తూ భారత్ సేవక్ సమాజ్ ద్వారా మన స్థానిక అభివృద్ధి పనులు ఎన్నో చేసికొనుటకు అవకాశము కలదని ఆ సమాజంద్వారానే యీ గ్రామములో ప్రస్తుతం మాతా శిశు సంరక్షణాలయం నిర్మింపబడుతున్నదని, సమాజమునకు యీ గ్రామ ప్రజలు పూర్తి సహకారము ఇచ్చి భవన నిర్మాణమును పూర్తిచేయుటకు తోడ్పడాలని విన్నవించారు.

ఎస్. వి. ఎల్. నరసింహంగారు మాట్లాడుతూ గ్రామ పురోభివృద్ధికి భారత్ సేవక్ సమాజ్ కృషి చేస్తున్నదని అందరూ యీ అభివృద్ధి కార్యక్రమములకు తోడ్పడాలని కొన్ని దుష్టశక్తుల ప్రచారానికి లోనుగాక పార్టీలతో నిమిత్తం లేకుండా సహాయము చేయాలని కోరారు.

మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారు మాట్లాడుతూ ప్రజలందరూ సమిష్టిగా స్థానిక అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనుటకు భారత సేవక్ సమాజ్ చాల వుపయోగకారిగా వున్నదని ప్రజలుగాని, స్థానిక సంస్థలుగాని ఏటువంటి అభివృద్ధి పనికైనా అయ్యే ఖర్చులో సగము భరించినచో ప్లానింగు కమీషన్‌వారు సమాజము ద్వారా సగము లభించేట్లు చేస్తారని తెలియజేశారు. "ఈ భవనానికి శంకుస్థాపన చేసే అవకాశము లభింపచేసినందులకు మీ అందరకు నా కృతజ్ఞత. యీ సమాజము భవననిర్మాణమును ఎక్కువ శ్రద్ధతో త్వరలో పూర్తిచేయుటకు వుపక్రమిస్తుందనే నమ్మకముతో యీ శంకుస్థాపన జరుగుతున్నది. ప్రజలందరూ భారత్ సేవక్ సమాజమునకు భవన నిర్మాణమునకు తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాను" అని సంజీవయ్యగారన్నారు.

సభాధ్యక్షులు శ్రీ శ్యామల సుబ్బారెడ్డిగారు మాట్లాడుతూ ప్రసూతి శిశు సంరక్షణాలయమునకు సంబంధించిన విషయాలు వివరించారు. ఈ సమాజము ద్వారా జరుగు ప్రతిపనికి వస్తురూపేణా కాయకష్టం రూపేణా, ధనరూపేణా సాయము చేయవలసినదిగా గ్రామప్రజలను కోరారు.

సంబూరు గ్రామ భారత్ సేవక్ సమాజ్ కన్వీనరు శ్రీ కొండా సుబ్బారెడ్డిగారు మంత్రి శ్రీ సంజీవయ్యగారికి ఆహ్వానాలను అంగీకరించి వచ్చిన ఇతర ప్రముఖులకు కృతజ్ఞత తెలిపారు. తరువాత భవననిర్మాణమునకు కావలసిన స్థలమును (20 సెంట్లు) దానము చేసిన దాతలను మంత్రిగారికి పరిచయము చేశారు.

# వేరుశనగ ఎగుమతి

## ప్రభుత్వానికి విజ్ఞప్తి

పంతిబాటూరు, జులై 6: వేరుశనగ ఎగుమతిగురించి బి. రామిరెడ్డిగారు ఇలా ప్రకటిస్తున్నారు:

"ఈమధ్య, ఆంధ్రప్రభుత్వ వ్యవసాయమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డిగారు ఢిల్లీలో కేంద్రప్రభుత్వ వాణిజ్య మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారిగారితో వేరుశనగ ఎగుమతులనుగురించి చర్చించగా, త్వరలోనే ఎగుమతికి అవకాశము కల్పించెదమని వాగ్దానము చేసినటుల తెలుస్తున్నది. ఇది శుభసూచన.

"గడచిన సంవత్సరము ఎగుమతిని దృష్టిలో పెట్టకొని చూచిన, యీ సంవత్సరము ఇంతవరకు జరిగిన ఎగుమతులు శ్రీ తిమ్మారెడ్డిగారు వెల్లడించిన లెక్కల ప్రకారం) నూనెలో 26 వ వంతును, పప్పులో 200 వ వంతుకుమాత్రం యీ సంవత్సరము అనుమతి లభించినట్లు తెలుస్తున్నది.

"ఒకప్రక్క ఎగుమతి వసతులు తగ్గిపోగా, మరొకప్రక్క పున ఉత్పత్తి పెరుగుచున్నది. ఇండియా ప్రభుత్వ లెక్కల ప్రకారం వేరుశనగ పండించిన భూమి దగిమ మొత్తంమీద 1952-1953 లో 95,65,000 ఎకరాలుకాగా 1953-1954 లో 1,06,64,975 ఎకరాలకు పెరిగింది. అందుచేత 1951 లో మనుము రు. 22-8-0 అమ్మిన వేరుశనగనూనె ప్రస్తుతము రు. 12-8-0 కు తగ్గిపోవలసి జరిగింది.

"ముఖ్యముగా కరువుకాటకములకు నిలయమైన రాయలసీమ జిల్లాలకు వేరుశనగపంట ప్రధానమైనదని అందరెరిగినదే. లేవిరి అవసరవస్తువుల ధరలు మాత్రం యధాతథంగా నుండినం వేరుశనగ ధర రోజురోజుకూ పడిపోవడం వల్ల రైతాంగము అస్వలపాలై, [illegible] వారి [illegible] యుంచి వ్యవసాయ కూలీ నారాదిరిం జరుగుచున్నది. కనుక వేరుశనగ వుత్పత్తిదారుల యిబ్బందిని గుర్తించి

కేంద్రప్రభుత్వము ఏమాత్రము ఆలస్యముచేయక వేరుశనగకు ఎగుమతి సౌకర్యములు వెంటనే కలిగించవలయును. ఆలస్యమైనయెడల వేరుశనగ పంట యావత్తు మిల్లుయజమానుల చేతిలోపడి ఉత్పత్తిదారులకు అన్యాయము జరుగుతుంది.

"రైతాంగముకూడా ఎగుమతి సౌకర్యము లభించేవరకు వేరుశనగ విడుదల చేయరని ఆశిస్తాను."

# ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవం

## శుభాకాంక్షలు పంపిన వారి వివరాలు

కర్నూలు, జులై 8: ఈనెల అయిదవతేదీన గుంటూరులో ఆంధ్ర హైకోర్టుకు కేంద్ర హోమ్ మంత్రి డాక్టరు కైలాస్‌నాథ్ కట్జూగారు ప్రారంభోత్సవం జరిపిన సందర్భంలో అనేకమంది శుభాకాంక్షలు పంపించారు.

ఒరిస్సా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎల్. పాణిగ్రాహి, పాట్నా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జనాబ్ జఫార్ ఇమామ్, ఉత్తర ప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ బి. మాలిక్, అస్సామ్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ సర్జుప్రసాద్, సౌరాష్ట్రం ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎల్. వి. షా, జమ్మూ, కాశ్మీర్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ జానకినాథ్ వజీర్, సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి గులామ్ హసన్, పాటియాలా ప్రధాన న్యాయమూర్తి శ్రీ తేజ్‌రామ్ నాభాసీన్, పంజాబ్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎ. ఎన్. భండారీ, భారత ప్రభుత్వ ప్లానింగు మంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా, కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ సి. డి. దేశ్‌ముఖ్, శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ ప్రభృతులు శుభ సందేశాలు పంపించారు.

# షెడ్యూల్డు తరగతులు జాతుల అభివృద్ధి

## కేంద్రప్రభుత్వ శ్రద్ధ

కర్నూలు, జులై 8: షెడ్యూల్డు తరగతులూ, షెడ్యూల్డు జాతుల అభివృద్ధికి మంజూరు చేయబడిన పార్లమెంటరీ గ్రాంటును సక్రమంగా వెచ్చించే విషయంలో కేంద్ర ప్రభుత్వ హోంశాఖ చాలా శ్రద్ధవహిస్తున్నదనీ, ఇందుకు అవసరమయిన ప్రణాళికలను పంపించమని కోరుతూ రాష్ట్రప్రభుత్వాలకు మళ్లీమళ్లీ వ్రాశామనీ కేంద్ర హోంశాఖమంత్రి డాక్టరు కైలాసనాథ కట్జూగారు ఈవేళ ఇక్కడ పత్రికా విలేఖరుల గోష్టిలో అన్నారు. ఈ విషయంలో ఆయన ఇంకా యిలా వివరించారు:

"షెడ్యూల్డు తరగతులు, షెడ్యూల్డు జాతుల అభివృద్ధి కార్యక్రమాలకు పార్లమెంటు మంజూరుచేసిన డబ్బు పంపిణీ కార్యక్రమం కేంద్ర హోంశాఖ అధీనంలో ఉన్నది. ఈ గ్రాంటుకు ఒక్కొక్కప్పుడు కొలదోపం పడుతుందని అనుభవంలో తేలినచ్చింది. అవసరాలనుబట్టి ప్రతిరాష్ట్రానికి ఈ గ్రాంటు నుంచి డబ్బు కేటాయిస్తాము. ఈ గ్రాంటునంతా సక్రమంగా పంపిణీ చేసి, సక్రమంగా వెచ్చింపచేసే విషయం గురించి ఈయేడు తగు జాగ్రత్త వహించాము."

# కుటుకులూరు పంచాయతి రద్దు

కర్నూలు, జులై 8: తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా కుటుకులూరు పంచాయతీ బోర్డు అధ్యక్షుడు టి. భూపారెడ్డిగారిని ఆ పదవినుంచి తొలగిస్తూ 1954 జులై 14 వ తేదీనుంచి ఒక సంవత్సరంపాటు ఆ పంచాయతీని రద్దుచేస్తూ స్థానికసంస్థల ఇన్‌స్పెక్టరు ఉత్తరువులు ఇచ్చారు. ఆ పంచాయతీ వ్యవహారాలను రామచంద్రపురం డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు చూస్తుంటారు.

# విజయవాడ పారిశ్రామిక ట్రిబ్యునల్

కర్నూలు, జులై 8: జిల్లాజడ్జీగా పనిచేసి విరమించుకొని విశ్రాంతితీసుకొంటున్న శ్రీ వి. ఎస్. దీక్షితులుగారిని విజయవాడ పారిశ్రామిక వివాదాల ట్రిబ్యునల్ సభ్యుడుగా ఆంధ్రప్రభుత్వం నియమించింది. ఈ ట్రిబ్యునల్ ప్రధాన కార్యాలయం విశాఖపట్టణంలో ఉన్నది.

# గూడూరు ఫిర్కా రైతుల యిబ్బందులు

బందరు, జులై 6: బందరు తాలూకా గూడూరు ఫిర్కాలోని భూములకు సకాలములో కాల్వ నీరు రానందున, ముదురునారోసి ఎడిగిన ఆకు చెడిపోయినదనియు నీరు వచ్చి నాకు కావలసినంత రాకపోవడము జరిగి, దిగువ రైతులకు అపారనష్టము వాటిల్లుచున్నదనియు, ఈ రైతులు ఎగ్జిక్యూటివ్ యింజనీరుగార్కి, సూపరింటెండెంటు ఇంజనీరుగార్కి పిటిషన్లు పెట్టి, టెలిగ్రాములు నిచ్చినను యింతవరకూ ప్రయోజనము లేదని యు రైతులు ఆందోళన చేయుచున్నారు. ఈ ఫిర్కాలో భూములకు పుష్కలంగా నీరుకావలసియున్నది. వెంటనే కాల్వల నీటిపారుదలకు పూనుకొని రైతులకు సహాయపడాలని రైతులు కోరుచున్నారు.

# ప్రైవేటు పాఠశాలల ఎత్తివేయుటకు విద్యామంత్రి దృఢనిశ్చయం

## గుంటూరుజిల్లా ఉపాధ్యాయ సభలో పట్టాభిరామారావుగారి స్పష్టీకరణ

బాపట్ల జులై 7: రాష్ట్ర విద్యామంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావుగారు యివాళ యిక్కడ గుంటూరు జిల్లా ప్రాథమిక ఉపాధ్యాయ సమితి సమావేశం ప్రారంభిస్తూ ప్రైవేటు పాఠశాలలను ఎత్తివేయాలని కుప్పుస్వామి కమిటీవారు చేసిన శిఫార్సు తనకు పూర్తిగా నచ్చిందనీ ఏట ఏమైనా సరే, యీ శిఫార్సును అమలు జరపడానికి తను సిద్ధంగా వున్నానని వెల్లడించారు.

ఉపాధ్యాయులు రాజకీయాల జోలికి పోక విద్యాభివృద్ధికే శక్తి సామర్థ్యాలన్నీ వినియోగించి కృషి చేయాలని సలహా యిచ్చారు.

ఎ. బి. ఎం ట్రైనింగు స్కూలు హాలులో జరిగిన యీ సభకు మాజీ ఎం. ఎల్. ఎ శ్రీమంతెన వెంకట్రాజుగారు అధ్యక్షత వహించారు. జిల్లా ప్రాథమికోపాధ్యాయ సమితి తరఫున మంత్రిగారికి సమర్పించిన వినతి పత్రములో ప్రాథమిక పాఠశాలలను వివిధ మేనేజిమెంట్ల నుండి తప్పించి ప్రభుత్వ మేనేజరుగా నిర్వహించుట అవసరమని కోరారు. ఒక్కొక్క ఉపాధ్యాయుడు 40 మంది విద్యార్థులకు బోధించాలని కుప్పుస్వామి కమిటీ నివేదికలోని శిఫార్సు సమంజసంగా లేదని, ఒక ఉపాధ్యాయుడు 20 మంది విద్యార్థులకంటె ఎక్కువమందికి బోధించలేడని, ప్రభుత్వము వారు ఉపాధ్యాయుల జీతములు పెంచేముందు, అన్ని మేనేజిమెంట్ల ఉపాధ్యాయులకు సమాన వేతనము లిచ్చి, ఆ తర్వాత ఉపాధ్యాయుల జీవనభృతికి తగినంతగా కనీస వేతనము లివ్వంచవలెనని సూచించారు.

# మైసూరులో కొత్త విద్యాసంస్కరణ

## అమలుకు నిర్ణయించినట్లు ముఖ్యమంత్రి ప్రకటన

బెంగుళూరు, జులై 8: వ్యవసాయ పనులలో తమతల్లిదండ్రులకు తోడ్పడటానికి వీలుగా స్థానిక పరిస్థితులకు వీలుగా శెలవులను సర్దుబాటుచేసే విధానాన్ని అమలుపర్చటానికి మైసూరు ప్రభుత్వం నిర్ణయించింది. 1955 జనవరిలో సర్వోదయ దినోత్సవంనాడు ఈ విధానాన్ని ప్రారంభించాలని కూడా నిర్ణయించింది.

ఈ కొత్త విద్యాసంస్కరణలను గురించి ప్రభుత్వనిర్ణయాన్ని వ్యక్తపరుస్తూ ముఖ్యమంత్రి కె. హనుమంతయ్యగారు ఇవాళ ఉదయం పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు.

శ్రీ హనుమంతయ్యగారు తమ ప్రకటనలో ఈ సంస్కరణలు పూర్తిగా కాకపోయినా, స్థూలంగానైనా గాంధీజీ చేసిన విద్యను అమలుపర్చటానికి ఉద్దేశించబడినవని అభివర్ణించారు.

ఈ నూతన విద్యావిధానాన్ని ప్రారంభించటానికి సర్వోదయదినం అన్నివిధాలా సరిపడినదనే నిర్ణయానికి వచ్చామనీ, ఆరోజున విద్యార్థులు, ఉపాధ్యాయులు సమావేశమై ప్రార్థన సమావేశాలు జరిపి, గాంధీజీ ఆదర్శాలు వివరించబడతాయనీ వివరించారు.

ఈ సంస్కరణలు అమలుపరిచేటప్పుడు, ఏ కొన్ని పాఠశాలలైనా సర్వోదయ దినోత్సవాన్ని జరపదలచుకోనప్పుడు, అందుకు తాము నిర్బంధించమన్నారు.

దేశశాంతి, అభివృద్ధికి గాంధీ ఆదర్శాలలో జాతిశక్తిపర్చబడగలదని తాము దృఢంగా విశ్వసిస్తున్నామన్నారు.

శెలవలనుగురించి ప్రస్తావిస్తూ మామూలుధోరణిలో ఇక శెలవులు నిర్ణయంజరగదనీ, స్థానిక ఋతుపరిస్థితులనుబట్టి నిర్ణయించబడుతుందనీ, వ్యవసాయప్రాంతాలలో ఆ ప్రాంతాల అవసరాల కనుగుణ్యంగా శెలవులు ఇవ్వబడతాయనీ పేర్కొన్నారు. విద్యాశాఖాధికారులకు స్థానిక అవసరాల కనుగుణ్యంగా శెలవులు నిర్ణయించే అధికారం ఇవ్వబడుతుందన్నారు. వేసవిలోకూడా పాఠశాలలు పనిచేస్తాయన్నారు.

తదితర పరిపాలనా వివరాలన్నీ త్వరలో ప్రకటించబడతాయన్నారు.

# మైసూరులో 'లా' కళాశాల ప్రారంభం

మైసూరు, జులై 7: ఆంధ్రరాష్ట్రంలో హైకోర్టు అవతరణ సందర్భానికి సరిగ్గా మైసూరునగరంలో ప్రప్రథమంగా 'లా' కళాశాల ప్రారంభించబడింది. ఈ కళాశాల ప్రారంభోత్సవంలో మైసూరు విశ్వకళాపరిషత్తు వైస్‌ఛాన్సలర్ ప్రొఫెసర్ వి. ఎల్. డిసౌజాగారు మాట్లాడుతూ భారత రాజ్యాంగరచనకు సాటిరైనది ప్రపంచంలోనే లేదన్నారు.

హైందవ శాసనాలు అతి ప్రాచీనములైననూ, వానిని సమగ్రంగా

# చెట్ల పెంపకంపట్ల కాశ్మీర్‌ప్రభుత్వ శ్రద్ధ

## రామకృష్ణరావుగారి ప్రశంస

హైదరాబాదు, జులై 6: "భారతదేశంలో వనమహోత్సవాలు జరగటం కొత్తగాదు. మనపూర్వులు చెట్లను ఆరాధించేవారు. కానీ కాలక్రమేణా ఆఆచారం అడుగంటిపోయింది. అడవులను నరికి భూములను సాగుచేసుకొనటం ప్రారంభించారు. కొందరు ప్రభుత్వ, పరవ్యక్తుల భూములను కూడా అప్రకారంగానే ఆక్రమణ చేసుకొన్నారు. యీవిధంగా దేశంలోని వృక్షసంపద నాశనమైంది. ప్రజలు యీఅవస్యాన్ని త్వరలోనే గుర్తించి తమతప్పులను దిద్దుకొని, వృక్షారాధనను ప్రారంభించారు" అని శ్రీ బూర్గుల రామకృష్ణారావు వనమహోత్సవ సందర్భంగా గాంధీభవనంలో న్యుభాగయాములోను చేసిన ఉపన్యాసములలో చెప్పారు.

రాష్ట్రంలో వృక్షరక్షణకు అటవీశాఖవారొక పథకాన్ని తయారుచేయాలని శ్రీ రామకృష్ణరావుకోరారు. చెట్లవిషయంలో కాశ్మీరు ప్రభుత్వం చూపేశ్రద్ధను వివరించారు. "అక్కడ ప్రతివ్యక్తి పెరట్లో ఫలవృక్షాలు పెంచుకుంటాడు. పట్టునూలుకు వినియోగపడే చెట్లను పెంచుతారు. అలాటివారికి ప్రభుత్వం ప్రోత్సాహమిస్తుంది. వృక్షపోషణ నిమిత్తమై కాశ్మీరుప్రభుత్వం సుమారు రు. 17 లక్షలు వ్యయంచేసింది. పర్యవసానంగా ఇప్పుడు యేటేటా 7 కోట్ల రూపాయలు ఆదాయం వస్తున్నది" అని ముఖ్యమంత్రి వెల్లడించారు.

శాసనబద్ధంగా పట్టాలు సంపాదించుకున్న భూములలోనున్న చెట్లపట్ల రైతులు చూపేవిధానం ముఖ్యమంత్రికి చాలాకష్టం కలిగించింది. రైతులుచెట్లు నరికివేయుటవల్ల ప్రభుత్వం తమ విధానాన్ని మార్చుకోవలసిన అవసరం కలిగిందన్నారు. మరాట్వాడాలో వృక్షసంపద పెంపొందించాలని కోరారు. రైతులు యీవుద్యమంలో పాల్గొనాలని కోరారు.

అనంతరం శ్రీ రంగారెడ్డిగారు ఉపన్యసిస్తూ పండిత నెహ్రూ నాయకత్వాన భారత్ సర్వతోముఖాభివృద్ధి పొందుటకు ప్రజలు సంపూర్ణ సహకారంతో పాటుపడాలని కోరారు.

కాలప్రవాహంలో అంతరించిపోయిన దేశాచారాలను పునరుద్ధరించి భారత ప్రతిష్ఠను నిలబెట్టమని ప్రబోధించారు. వృక్షారాధన అనాదిగా భారతదేశంలో ఆచారంగా వుండేది. దానిని పునరుద్ధరించుకోరారు.

శ్రీ ధరణీధర పంఘీ శ్రీ. వాసుదేవ నాయక్ కూడా ఉపన్యసించారు.

సికింద్రాబాదు మునిసిపల్ కార్పొరేషను అధ్వర్యాన జీరాలోని "న్యూపార్కు" లో వనమహోత్సవం జరిగింది. శ్రీమతి సంగం లక్ష్మీబాయి, విద్యా ఉపమంత్రి, మొక్కలను నాటారు. శ్రీ యస్. ఆర్. వెంకటేశం మేయరు, శ్రీ నవాబ్‌అలీఖాన్, స్థానిక పరిపాలనాశాఖ కార్యదర్శి, శ్రీరంగపాండు, డిప్యూటీ మేయరుకూడా మొక్కలు నాటారు. అనంతరం అక్కడ కూడిన కార్పొరేషను సభ్యులు పురజనులు క్లాక్ టవరు లేన్ హైస్కూలు వరకు ఊరేగింపు వెళ్లారు. రోడ్డు ప్రక్కనకూడా మొక్కలు నాటారు.

నగరాలలో వనమహోత్సవం అత్యుత్సాహంతో జరుగుతున్నది. రోడ్ల ప్రక్కన సుమారు 10 గజాలకొక మొక్క చొప్పున నాటుతున్నారు. మొక్కను పశువులు మేసివేయకుండా గజన్నర ఎత్తున మట్టితో గోడలు కట్టారు.

# తెలంగాణా రచయితల సంఘం శాఖలు

హైదరాబాదు, జులై 7: తెలంగాణా రచయితల సంఘం అధ్యక్షులు కాళోజీ నారాయణగారు ఈ దిగువ శాఖలను నామినేటుచేశారు: సికింద్రాబాదుశాఖ - అధ్యక్షులు, పెనుగుడుంపురం రాజేశ్వరాచార్యులు; ఉపాధ్యక్షులు, పరాయితం కృష్ణమూర్తి, కార్యదర్శి, యం. బలరామాచార్యులు సహాయకార్యదర్శులు, యస్. రామమూర్తి, గోపాలాచార్యులు, సభ్యులు, తోట నారాయణ, శ్రీరాములు, ఐక్ష్ణి రామమూర్తి, పురుషోత్తం, అకెళ్ల నరసింహమూర్తిగారలు.

డోర్నకల్లు శాఖ: అధ్యక్షులు, మల్లికార్జునరావు, కార్యదర్శి, యల్. మధుసూదనరావు, సభ్యులు యం. శ్రీనివాసరావు, బి. సూర్యనారాయణ, యస్. రంగారావుగారలు.

పరిశోధన గావించటానికి న్యాయశాస్త్ర పట్టభద్రులు పూనుకోవాలన్నారు.

మైసూరునగరంలోని శారదావిలాస విద్యాసంస్థవారు ఈ కళాశాలను స్థాపించారు. దీనిని మైసూరు విశ్వవిద్యాలయంవారు గుర్తించారు. (స్వ. వి.)

# ఆంధ్రకు శాయశక్తులా సహాయం

## కేంద్ర హోమ్‌మంత్రి వాగ్దానం

(ఆంధ్రపత్రిక విలేఖరి)

కర్నూలు, జులై 8: ఆంధ్ర రాష్ట్రానికి అన్నివిధాలా సహాయపడతానని కేంద్రప్రభుత్వ హోమ్‌శాఖ మంత్రి డాక్టరు కైలాస్‌నాథ్ కట్జూగారు ఈ వేళ ఇక్కడ పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రసంగిస్తూ వాగ్దానం చేశారు.

ఆంధ్ర ప్రభుత్వ ప్రధాన కార్యాలయంలో జరిగిన ఈ పత్రికా విలేఖరుల గోష్ఠిలో డాక్టరు కట్జూ ఇంకా యిలా అన్నారు:

"మంచిపని చేసేటట్లయితే నేను కూడా సిఫార్సు చేస్తాను. తమ అనుభవంలోకి రాగల మేలు జరగడానికి డబ్బు వచ్చిస్తారని తెలిస్తే ప్రజలు ఎంత పేదస్థితిలో వున్నప్పటికీ ఆ పని చెయ్యడానికి చేతనైనసహాయం చేస్తారన్న గట్టినమ్మకం నాకటి ఉన్నది. ఉదాహరణకు ఒక విషయం చెబుతాను. నేను అమరావతి వెళుతూ దోవలో ఒక గ్రామంలోని ప్రజలను 'మీకు నేను చేయవలసిన దేమైనా ఉన్నదా' అని అడిగాను. వారో కొన్ని మైనర్ ఇరిగేషన్ పనులు తమ ప్రాంతంలో అమలు జరగవలసిన అవసరం ఉన్నదని వారు అన్నారు. వాటికి సుమారు ఎంత ఖర్చవుతుందని వారిని నేను అడిగాను. సుమారు అయిదువేల రూపాయలు కావలసి రావచ్చునని వారు అన్నారు. అంతట ఆ ఖర్చులో సగం భరించడానికి సిద్ధమేనా అని నేను వారిని ప్రశ్నించాను. అందుకు వారు వెంటనే అంగీకరించారు. అసలు విషయ మేమిటంటే మనమొక ప్రణాళికను తయారుచెయ్యాలి. ప్రణాళిక మంచిదయితే కాయకష్టం రూపంలోగాని లేదా ధనరూపంలోగాని గ్రామస్థులు విరాళాలు ఇస్తారు. తమ పరిస్థితులను తాము బాగుచేసుకోవాలన్న చైతన్యం ప్రజలలో ఉన్నది."

# కుప్పుస్వామి కమిటీ సిఫార్సులు

## కడపజిల్లా ఉపాధ్యాయుల సూచనలు

కడప, జులై 4: అయిదు సంవత్సరాల సర్వీసుగల ఉపాధ్యాయునికి ఒక రూపాయ ఇంక్రిమెంటు ఇవ్వాలని కుప్పుస్వామి కమిటీచేసిన సిఫార్సును సంవత్సరాలకొద్దీ సర్వీసుగల ఉపాధ్యాయులకు న్యాయం జరిగేవిధంగా సవరించవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తూ కడపజిల్లా ఉపాధ్యాయ సంఘం కార్యవర్గ సమావేశంలో తీర్మానించారు. సభకు జి. వెంకట నరసయ్యగారు అధ్యక్షత వహించారు.

సమావేశానికి రాష్ట్రసంఘం తరపున శ్రీ ఎ. విజయరామ రాజుగారు హాజరయ్యారు. కార్యదర్శి శ్రీ బోనాల పుల్లన్నగారు జిల్లా మహాసభనుండి నేటివరకు జరిగిన పనిని పరీక్షించారు. జమాఖర్చులను సభవారు ఆమోదించారు. జిల్లా ఉద్యమ నిర్మాణాన్ని కట్టుదిట్టం చేయడానికి వెంటనే ఆయా తాలూకాసంఘ కౌన్సిల్ సమావేశాలు జరపాలని పెంటరు సంఘాలను అన్ని ప్రాంతాల్లో నిర్మించాలని నిర్ణయించారు. జిల్లా సంఘ ఉద్యమానికి రాష్ట్రకోటాకు కలసి అవసరమయిన 100 రూ॥లను ఆయా తాలూకాల మధ్యకోటాలను నిర్ణయించారు. ఉపాధ్యాయ పత్రికకు చందాదారులను చేర్పించాలని విజయవాడలో జరిగే వుద్యమ తరగతులకు 5 గురు హాజరుకావాలని నిర్ణయించారు. చర్చానంతరం యీ క్రింద తీర్మానాలు ఆమోదించబడినవి.

కుప్పుస్వామి కమిటీ వేతనాల సిఫార్సులో 5 సం॥లకు 1 రూపాయి యింక్రిమెంటు యివ్వాలనే సూచన సర్వీసు టీచర్లకు చాల అన్యాయం చేస్తున్నది. కొన సంవత్సరాల కొలది విద్యాసేవచేసిన ఉపాధ్యాయులకు న్యాయము జరిగేవిధంగా యీ సూచనను సవరించాలని ప్రభుత్వాన్ని కోరుతూ కనీసం వేతనాల నిర్ణాయక సంఘం నిర్ణయించిన వేతనాలయినా మంజూరు చేయాలని ప్రభుత్వాన్ని అభ్యర్థించుతూ ఒక తీర్మానం చేశారు.

ఒక్కొక్క ఉపాధ్యాయునికి 40 మంది విద్యార్థు లుండాలని కమిషను సూచన ఉపాధ్యాయుల కెక్కువ శ్రమ భారాన్ని కల్గిస్తున్నది. యీ సంఖ్యను 30 కి తగ్గించాలని ఒకతీర్మానంలో విజ్ఞప్తిచేశారు. 5 వ తరగతిలో వు విద్యార్థులకు చదువు చెప్పే యోగ్యతయాయ్యరు గ్రేడుఉపాధ్యాయులకు వున్నది. కొన హయ్యరు ఎలిమెంటరీ ట్రయినింగు పాఠశాలలు మూసివేయాలనే సూచనను పాటించనక్కరలేదని ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేశారు.

కమిటీ సిఫార్సులలో విద్యాభివృద్ధికి అవసరమైన అన్ని సూచనలను వెంటనే అమలు జరపవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ వేరొక తీర్మానం చేశారు.

# ఢిల్లీ ప్రకటనప్రకారం ఇండోచైనా సమస్యాపరిష్కారం

## సాధ్యమేనని హోచిమిన్ ప్రకటన: జెనీవా సభకు డలెస్ రాకపోయే అవకాశం

పారిస్ జూలై 6: ఇండోచైనాలో సాధ్యమైనంత త్వరలో శాంతి ఏర్పడాలని ఫ్రెంచి ప్రధాని మెండీస్ ఫ్రాన్స్ చేసిన ప్రకటనను తాను ఆమోదిస్తున్నట్లు వీట్మిన్ నాయకుడు డా॥ హోచిమిన్ ప్రకటించారు. జెనీవా సమావేశంలో వ్యవహారం కొంత మందకొడిగా నడుస్తున్నదనీ, అయితే ఇప్పటి వరకూ సాధించిన ఫలితాల వల్ల శాంతి స్థాపన అవకాశాలు పెరిగినవని ఆయన అన్నారు. నెహ్రూ-చౌఎన్‌లై సంయుక్త ప్రకటనలో చెప్పిన సూత్రాలను ఇండోచైనా సమస్యా పరిష్కారానికి కూడా వర్తింపచేయవచ్చునని హోచిమిన్ అభిప్రాయం వెల్లడించారు.

వీట్మిన్ సమాచార సంస్థ హోచిమిన్ వెల్లడించిన ఈ అభిప్రాయాలను న్యూచైనా వార్తా సంస్థ నేడు ప్రచురించింది.

"సంప్రదింపులు జరపటానికి వీట్మిన్‌లకు గల కోరికవల్ల సంప్రదింపులు సాగటం వీలయింది. ఎదటి పక్షం కూడా హృదయపూర్వకంగా పరిష్కారాన్ని కోరి, దాని కోసం కృషిచేస్తే అది తప్పకుండా సాధ్యపడుతుంది. అయితే ఉభయ పక్షాలకూ ఒప్పందం కుదరకుండా చేసేందుకు అమెరికా చేస్తున్న దుష్ప్రయత్నాలను జాగ్రత్తగా కనిపెట్టి అరికట్టటం మాత్రం చాలా అవసరం.

చైనా, ఇండియా, చైనా, బర్మాల ప్రధానులు చేసిన సంయుక్త ప్రకటనలు ఆసియా ప్రజల శాంతి కాంక్షను వెల్లడిస్తున్నవి. పరస్పరం స్వాతంత్ర్యాన్ని గుర్తించటం, పరస్పరం సార్వభౌమాధికారాలను పాటించటం, పరస్పరం లాభం కలిగించేందుకు ప్రయత్నించటం మొదలైన సూత్రాలను నిర్దేశిస్తున్న ఆ ప్రకటనలు ఆసియాలోనే కాక యావత్ ప్రపంచంలోనూ కూడా శాంతికి దోహదం చేస్తున్నవి. వీటిని యావత్తు ఆసియా ప్రజలూ హర్షిస్తున్నారు. ఇండోచైనా సమస్యా పరిష్కారానికి కూడా ఈ ప్రకటనల్లో సూత్రాలను అన్వయించవచ్చును" అని హోచిమిన్ వివరించారు.

హోచిమిన్ ఇటీవలే చైనా ప్రధాని చౌఎన్‌లైతో మూడు రోజుల పాటు సంప్రదింపులు జరిపారు.

హోచిమిన్ ప్రకటనను ఫ్రెంచి రాజకీయవర్గాలు విశేష శ్రద్ధాసక్తులతో పరిశీలిస్తున్నారు. ఇది నిజంగా చిత్తశుద్ధితో చేసిన ప్రకటనే అయి వుంటుందని వాళ్లు అంగీకరిస్తూ, ఫ్రాన్సు కూడా శాంతియుతంగా గౌరవప్రదమయిన సంధి చేసుకోవాలన్న కోరికను సుస్పష్టంగా వెల్లడించి ఉన్నదని ఉదహరించారు.

### జెనీవా సభకు డలెస్ ముఖం తప్పించే సూచన

వాషింగ్టన్, జూలై 8: ఇండోచైనా సమస్యపై తిరిగీ సంప్రదింపులు సాగించే నిమిత్తం అగ్రరాజ్య విదేశాంగ మంత్రులు సన్నాహ పడుతుండగా, అమెరికా విదేశాంగమంత్రి డలెస్ నేడిక్కడ ఒక విషయం తెలియజేశారు. తాను కానీ, ఉప విదేశాంగమంత్రి బెడెల్ స్మిత్ కానీ ఆ సంప్రదింపులకు వెళ్లే విషయమై ప్రస్తుతం ఎటువంటి ఆలోచనా లేదని అన్నారు. అయితే అసలు తాము వెళ్లేదేలేదని మాత్రం తాను చెప్పననీ, ప్రస్తుతానికి అటువంటి ఆలోచనలు మాత్రం లేవనీ ఆయన అన్నారు.

సోవియట్ విదేశాంగమంత్రి మాలటోవ్ ఈ సంప్రదింపులకోసం రేపే జెనీవా చేరుకున్నారు. బ్రిటిష్ విదేశాంగమంత్రి ఈడెన్ సోమవారం నాడు బయలు దేరతారని నేడు లండన్‌లో అధికారరీత్యా ప్రకటించబడ్డది. ఈడెన్ ఫ్రెంచి ప్రధాని మెండీస్ ఫ్రాన్స్‌తో సంప్రదింపులు జరుపుతారని ప్రధాని చర్చిల్ నేడు కామన్స్ సభలో వెల్లడించారు.

ఫ్రెంచి ప్రధాని మెండీస్ ఫ్రాన్స్ శనివారం కానీ, ఆదివారం కానీ జెనీవాకు బయలు దేరుతారు. చైనా ప్రధాని చౌఎన్‌లై కూడా త్వరలో జెనీవా రాగలరని తెలిసింది. కాని తేదీ మాత్రం ఇంకా ప్రకటించ లేదు.

లోగడ జెనీవా సమావేశంలో అనధికార మధ్యవర్తిగా పనిచేసి, సంప్రదింపులు విఫలం కాకుండా చేయటంలో ప్రముఖపాత్ర వహించిన భారత ప్రతినిధి కృష్ణమీనన్ కూడా రేపు ఒటావానుంచి తిరిగివచ్చి తక్షణం పారిస్ మీదుగా జెనీవాకు బయలుదేరి పోతున్నారు.

అయితే ఇంతవరకూ వచ్చేవారం జెనీవాలో సంప్రదింపులు ప్రారంభమయినప్పుడు అమెరికన్ ప్రతినిధి వర్గానికి ఎవరు నాయకత్వం వహించేదీ తేలలేదు.

### హనోయ్ రక్షణకు ఫ్రెంచి సేనాని నిశ్చయం

హనోయ్, జూలై 8: హాంకాంగ్ రాజధాని హనోయ్‌ను, హైఫాంగ్ రేవును ఏ సేనలూ కాపాడవలసి ఉండగా ఇండోచైనాలో ఫ్రెంచి సర్వసేనాని జనరల్ ఎలీ నేడు ప్రతిజ్ఞ ప్రకటించారు. హనోయ్‌ని రక్షించవలసిందిగా తనకు ప్రభుత్వం దగ్గరనుంచి పదే పదే ఆదేశం వచ్చిందని ఆయన తెలియజేశారు.

ఫ్రాన్సు వీట్మిన్‌లతో ఒప్పందం కుదుర్చుకుంటే అది అమెరికా, బ్రిటనుల సమ్మతితోనే చేసుకుంటుందని జనరల్ ఎలీ భావిస్తున్నట్లూ, వీట్నాం సేనలను సన్నాహపరచాలనే అమెరికన్ పథకాన్ని ఆయన సమర్థిస్తున్నట్లూ అభిజ్ఞవర్గాలు తెలియజేస్తున్నారు.

### హంగ్‌యన్‌పై వీట్మిన్ల ముట్టడి

ఉత్తర ఇండోచైనాలోని ఫ్రెంచి రక్షణశ్రేణికి దక్షిణ అంచున ఎర్రనది ఒడ్డునవున్న హంగ్‌యన్ పట్టణాన్ని వీట్మిన్ సైన్యాలు ఇంచుమించుగా చుట్టుముట్టినవి. కొత్త ఫ్రెంచి రక్షణ శ్రేణులమీదకూడా వీట్మిన్లు ఒత్తిడిచేస్తున్నట్లు యీ అంశం సూచిస్తున్నది.

ఫ్రెంచి విమానాలు నిన్న హనోయ్ హైఫాంగ్ రహదారిమీదకు మూగుతున్న వీట్మిన్ బలాలపై తీవ్రదాడులు జరిపినవి.

## మద్రాసు వార్తలు

ప్రజాపతి ఉపాధ్యక్షులు ఎం. అనంతశయనం అయ్యంగారు మద్రాసు ప్రభుత్వంవారు పూర్వ నిర్ణయాన్నే లారీల పన్ను వసూళ్లి సందర్భంలో అమలుచేస్తామన్నందున లారీ యజమానులు సమ్మెను మానవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నారు.

గుంటూరునుంచి అనంతశయనం గారు ఇవాళ మద్రాసువచ్చారు. వారు మద్రాసు ఆర్థికమంత్రి సి. సుబ్రహ్మణ్యంగారిని చూసి ఇవాళ మాట్లాడారు.

భారత-సోవియట్ సంస్కృతీ సంఘ సామాన్య సభ్య సమావేశం జూలై 10వ తేదీ సాయంత్రం 5½ గం.లకు మౌంట్ రోడ్డు నెం. 199 ఇంట్లో జరుగ గలదని కార్యదర్శి కె. వి. శంకరన్ గారు వ్రాస్తున్నారు.

మద్రాసు కార్పొరేషను బ్యాండు కర్నాటిక్ సంగీతకచేరీ ప్రతిరోజు ఆయాప్రాంతాల్లో 5½-7½ మధ్య జరుపుతారు. ఆదివారం 11 వతే నాగేశ్వర ఘాట్ చివర; సోమవారం-మెరినా ఐ. జి. ఆఫీసు, మంగళవారం నాగేశ్వరఘాట్ ప్రక్క రోడ్డు చివర, 15 నాగేశ్వరఘాట్, 16 మెరినా సెనెట్ హౌస్ ఎదురుగా, 17 వ తేది శ్రీ నాగేశ్వర్రావు పార్కు లజ్ చర్చిరోడ్డు మైలాపూరు.

ఆగస్టు 18 వ తేదీన సెనెట్ హౌస్‌లో మద్రాసు విశ్వకళా పరిషత్తు స్నాతకోత్సవోపన్యాసం చెయ్యడానికి డా॥ ఆర్. ఎం. అలగప్ప చెట్టియారు అంగీకరించారు.

జూన్ 19 వ తేదీతో అంతమైన వారంలో మద్రాసునగరంలో కార్మిక జీవనవ్యయసూచి 342 న్నూ, జూన్ 26 వ తేదీతో అంతమైన వారంలో 341 న్నూ ఉన్నది.

## హైద్రాబాదు వార్తలు

స్థానిక సంఘసేవా మహాసభ వారు స్థాపింప పూనుకున్న రేడియమ్ ఇన్‌స్టిట్యూట్ నిధికి భారత సర్వసేనాధిపతి రాజేంద్ర సింహ్‌జీ రు 100 లు, ఛత్తారీ నవాబు రు 500 లు విరాళాలు ఇచ్చారు.

ప్రసన్నానందస్వాముల వారిసన్నిధిని హిమాయత్ నగర్‌లోని ఉత్తమ నివాస్‌లో 4 వ తేదీన వేదోక్తంగా దుర్గాసూక్త యజ్ఞంజరిగింది. పలువురు వేదపఠనంచేశారు.

### కాశిమ్ రజ్వీ

రజాకర్ ఉద్యమ నాయకుడు కాశిమ్ రజ్వీ హైద్రాబాద్ సెంట్రల్ జైలునుంచి పూనాలోని యెర్రవాడ సెంట్రల్ జైలుకు 6 వ తేదీన మార్చబడ్డట్లు తెలుస్తున్నది. ఆదివారం అర్ధరాత్రికి కొద్దిగా ముందు రజ్వీ కారులో తరలించబడ్డారు. రజ్వీని పూనాకు తరలించే హైద్రాబాద్ ప్రభుత్వ నిర్ణయం విషయంలో చాలా గుప్తంగా ఉంచారు.

### నవ్యకళా సమితి

సికింద్రాబాద్ నవ్యకళాసమితి వార్షిక సమావేశంలో ఈ క్రిందికార్యవర్గం ఎన్నుకోబడింది: ఎస్. సత్యనారాయణ గుప్త (అధ్యక్షుడు), సి. ఎస్. ప్రకాశరావు (ఉపాధ్యక్షుడు), సి. ఆంజనేయులు (కార్యదర్శి), ఎస్. రంగారావు శర్మ (సహాయకార్యదర్శి) జోటూరి సీతారామలింగం (కోశాధికారి), సభ్యులు - డి. కోటయ్య, బి. నారాయణమూర్తి, సి. శివన్నారాయణరావు, జి. సత్యనారాయణ, వి. ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రి, బి. జయరామశాస్త్రి గారలు.

## ఆగ్నేయాసియా రక్షణావ్యవస్థ

(1 వ పేజీ తరువాయి)

చేరగలవో ఇప్పుడే చెప్పటం కష్టం" అని వెబ్ వివరించారు.

### కేసీ ఆశాభావం

ఆస్ట్రేలియా విదేశాంగ మంత్రి కేసీ నేడిక్కడ ప్రసంగిస్తూ ఆగ్నేయాసియా దేశాలు వీలయినంత ఎక్కువ సంఖ్య ఆగ్నేయాసియా రక్షణ ఒప్పందంలో చేరాలన్న ఆశను వెల్లడించారు.

"ఆగ్నేయాసియా రక్షణ అన్నది కేవలం ఆసియా దేశాలకు సంబంధించినది. కాబట్టి ఆరక్షణ వ్యవస్థకు కేవలం యూరపియన్ రాజ్యాలే హామీ యివ్వటమన్నది జరిగితే, అది విపరీతంగా ఉంటుంది. అందువల్ల యీ విషయమై ముందుగా ఆసియా దేశాలతో సంప్రదించి, అవికోరితే వాటినికూడా చేర్చుకోవాలి. అన్‌జూస్ ఒప్పందం దీనితో జేంకుండా, విడిగానే ఉండగలదని ఆశిస్తున్నాను" అని కేసీ వివరించారు.

### డలెస్ ధోరణి

ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, అమెరికాలు రేపు వాషింగ్టన్‌లో ఆగ్నేయాసియా రక్షణ ఒప్పందంపై సంప్రదింపులు ప్రారంభిస్తవని నేడు తెలియవచ్చింది.

ఈ ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థలోకి ఆసియాలోని కమ్యూనిస్టేతర దేశాల్ని చేర్చటం జరగ్గలదన్న అభిప్రాయాన్ని అమెరికా విదేశాంగ మంత్రి డలెస్ నేడు వాషింగ్టన్‌లో వెల్లడించారు.

ప్రస్తుతం యీసమస్యపై బ్రిటన్, అమెరికాల మధ్య వాషింగ్టన్‌లో జరుగుతున్న సంప్రదింపులు సర్వ రావశ్యకతను దృష్టిలో పెట్టుకుని నడుస్తున్నవని ఆయన తెలియజేశారు.

ఈ ఒప్పందంలో పాల్గొనే ఆసియా దేశాలు ఏవి అన్న విషయమై ప్రస్తావిస్తూ సయాం, ఫిలిప్పీన్సు ఇప్పటికే అమెరికాకు మాట ఇచ్చి వున్నవనీ, ఇతర దేశాలుకూడా చేరగలవని అనుకుంటున్నాననీ తెలియజేశారు.

### ఢిల్లీతో సంప్రదింపులకు భారత రాయబారి ప్రయాణం

న్యూయార్కు, జూలై 8: అమెరికాలోని భారత రాయబారి జి. ఎల్. మెహతా నేడు లండన్‌మీదుగా భారతదేశానికి, తమ ప్రభుత్వంతో సంప్రదించే నిమిత్తం బయలుదేరారు. అమెరికా-ఇండియాల సంబంధాలను గురించీ ఆగ్నేయాసియా పరిస్థితులను గురించీ ఈయన ఢిల్లీలో సంప్రదించ గలరని తెలుస్తున్నది.

ఈయన ఆగస్టునెలలో తిరిగి ఇక్కడికి రాగలరని తెలుస్తున్నది.

## మద్యనిషేధం: కట్జూ హెచ్చరిక

(1 వ. పేజీ తరువాయి)

కర్నూలును అభివృద్ధి చేశారు. ముమ్ముందు ఈ పట్టణాన్ని అభివృద్ధి చేస్తారని ఆశిస్తున్నాను. ఈపట్టణాన్ని అభివృద్ధి చేయవలసిన బాధ్యత పట్టణ పౌరులమీద కూడా వున్నది. పురాతనమైన మనభారతదేశంలో వివిధ కులాలవారూ, వివిధ మతాలవారూ పరస్పర సుహృద్భావంతో శతాబ్దాల తరబడి జీవించారు. ఈనాడుకూడా ప్రజలు ప్రాంతీయాభిమానం మొదలైనవాటిని విస్మరించి దేశాభ్యుదయ సాధనకు సమైక్యంగా కృషిచెయ్యాలి. తమ దేశానికి బలం సమకూర్చుకొన్ని గొప్పదేశంగా రూపొందించుకొనడమే భారతీయుల ఆశయం. సంఘంలోని వ్యక్తులకు వ్యక్తిజీవితం ఉంటుంది. అయినా వారందరూ సంఘంలో భాగస్థులే. అదేవిధంగా దేశంలోని రాష్ట్రాలన్నీ సమస్యలన్నింటినీ యావద్భారత దృష్టితో చూడాలి. దేశాభ్యుదయసాధనలో ప్రజలు తమ కర్తవ్యం తాము నెరవేర్చాలి. ప్రభుత్వం తన విధిని తాను నెరవేర్చుతుంది. పరస్పర సహాయంతో ప్రజలూ ప్రభుత్వమూ కలిసి తమ దేశాన్ని గొప్పదేశంగా రూపొందించుకొని మహత్తర లక్ష్యాలను సాధించగలరు."

గుంటూరు విజయవాడలవంటి పట్టణాలను చూచినప్పుడు తనకుకలిగిన అభిప్రాయాలను వివరిస్తూ మద్యనిషేధంవల్ల దేశంలో ప్రజాసామాన్యానికి ప్రయోజనం కలిగిందని డాక్టరు కట్జూ అన్నారు. "పూర్వపురోజులలో కూడా దేశజనాభాలో నూటికి పదిమంది మద్యపానం జేస్తే వారిలో తొమ్మిదిమంది కష్టపడి పనిచేసుకునే తరగతికి చెందినవారు. వారందరికీ మద్యనిషేధంవల్ల ప్రయోజనంకలిగింది. సురాపానందురాలవాటు నిర్మూలనకై గతంలో పికెటింగ్ చేసినప్పటి అనుభవాన్ని దేశం విస్మరించరాదు. మద్యనిషేధం అనే ఆదర్శాన్ని కాంగ్రెసు ప్రబోధించింది. ఆ ఆదర్శంవిషయంలో వెనుకంజవేయడం అనేది పెద్దమోసమే కాగలదు. దేశంలో ఏఒక్కరు తాగకుండేవిధంగా ప్రజాభిప్రాయాన్ని దిద్దితీర్చుకోవాలి. ఈ త్రాగుడు దురలవాటు నిర్మూలించబడేనంతవరకూ దేశం అభివృద్ధి చెందజాలదు." అని కూడా డాక్టరు కట్జూ అన్నారు.

కర్నూలు పురపాలక సంఘం మాజీ అధ్యక్షుడు మహబూబ్ అలీఖాన్‌గారు కృతజ్ఞతాభివందనం చెప్పారు. జనగణమన గేయగానంతో సభ ముగిసింది.

## తాటిచెట్టునుంచి రకరకాల వస్తువులు తయారుచేసే పథకం

### — ఆంధ్రప్రభుత్వ ప్రణాళిక వివరాలు

కర్నూలు, జూలై 8: రాష్ట్రంలో అమలు జరపడానికి గాను తాటిచెట్లనుంచి రకరకాల వస్తువులు తయారు చేయించడానికి ఉపయోగపడే ఒక ప్రణాళికను ఆంధ్ర ప్రభుత్వం ఇటీవల ఆమోదించింది. ఆ ప్రణాళిక వివరాలు నేడు తెలియవస్తున్నవి:

ఈ ప్రణాళికకు గాను ప్రభుత్వం ఒక లక్ష ఆరు వేల ఎనిమిదివందల ఇరవై యేడు రూపాయలు వెచ్చించవలసి ఉంటుంది. ఇందులో డెబ్బయివేల ఎనిమిదివందల ఇరవయ్యేడు రూపాయలు ఏటేటా అయ్యే ఖర్చులు. ఆరువేల రూపాయలు ఒకసారి చెయవలసినఖర్చు. ఈ ప్రణాళికలో తయారయ్యే వస్తువుల విక్రయ సౌకర్యాలకు ముప్పయివేల రూపాయలను పెట్టుబడిగా ఉంచాలి.

ఈ స్కీముకు ఆధారంగా రెండు సూత్రాలున్నయ్. తాటిబెల్లం మొదలయినవాటిని తయారు చేసే విషయంలో రాష్ట్ర ప్రభుత్వం యేర్పాటు చేయనున్న శిక్షణా కేంద్రంలో గాని లేదా ప్రభుత్వం గుర్తించిన అట్టి శిక్షణా కేంద్రాలలో గాని శిక్షణ పొందిన కనీసం ఒక వ్యక్తినయినా సహకార సంఘాలు లేక ఇందుకు ఏర్పాటు చేయబడే ఇతర సంఘాలు తమ ఉద్యోగాలలో నియమించాలన్నది ఆ సూత్రాలలో మొదటిది. నీరా అమ్మకం అనుమతులను వ్యక్తులెవరికీ ఇవ్వరాదు. సహకార సంఘాలకూ, ప్రభుత్వశాఖలకూ, ప్రభుత్వం గుర్తించిన సంస్థలకూ మాత్రమే అట్టి అనుమతులు ఇవ్వాలన్నది, రెండవ సూత్రం. ఈ సూత్రాలలో ఇమిడివున్న కార్యవిధానానికి తోడుగా, ఇందుకు అవసరమయిన శిక్షణా సౌకర్యాలూ, సాంకేతిక సహాయమూ లభించడానికి వీలుగా రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో కొన్ని 'నమూనా నీరాభవనాలు' తాటిచెట్టునుంచి రకరకాల వస్తువులను తయారు చేసే కేంద్రాలను నెలకొల్పడం ఈస్కీము ఉద్దేశము.

ఈ ఆర్థికసంవత్సరం పూర్తి అయ్యేలోగా మూడువందల 'నీరా భవనాలనూ', మూడువందల వస్తూత్పత్తి కేంద్రాలనూ నెలకొల్పడం ఈ స్కీము ఆశయం.

ఈ ఆశయసిద్ధికిగాను అభివృద్ధిశాఖ అజమాయిషీలో పదకొండు శిక్షణా కేంద్రాలు వస్తూత్పత్తి కేంద్రాలనూ, ఇరవైరెండు 'నమూనా నీరా భవనాలను' నెలకొల్పి నడిపించవలసి ఉన్నది. ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క నమూనా కేంద్రమూ—దానికి అనుబంధంగా రెండు నమూనా నీరాభవనాలూ, ఉంటవి.

సహకారసంఘాలు పంపించే మూడువందలమంది అభ్యర్థులకు శిక్షణ ఇస్తారు. ఈ విధంగా శిక్షణపొందే అభ్యర్థులు శిక్షణ పూర్తి అయినతరువాత తమ తమ సహకార సంఘాలున్న ప్రాంతాలలో నీరానుంచి వస్తువులు తయారుచేసే కేంద్రాలనూ, నీరాభవనాలనూ నడుపుతారు.

అభివృద్ధిశాఖ సహాయాధికారి, (తాటిచెట్టు వస్తువుల), పన్నెండుమంది తాటిబెల్లం శిక్షణోపాధ్యాయులు, 30 మంది మేనేజర్లు మొదలయినవారికి స్వల్పకాల శిక్షణ ఇస్తారు.

ప్రభుత్వం ఏర్పాటు చేసే కేంద్రాలు క్రమంగా స్వయంపోషకం కాగల వనుకొంటున్నారు.

సహకారసంఘాలు పంపెంచే మూడు వందలమంది అభ్యర్థులుకాక, రెండువందలమంది గీతపనివారికి కూడా శిక్షణ ఇస్తారు.

తాటిబెల్లం, తాటి పంచదార, సిరప్ మొదలయినవాటిని తయారుచేసే విషయంలో వస్తూత్పత్తి కేంద్రాలు ప్రత్యేక కృషి చేస్తయ్.

తాటిచెట్టునుంచి రకరకాల వస్తువులు తయారుచేసే విషయం గురించి కరపత్రాలూ, స్లైడ్లు, రికార్డులు, ఛార్టులూ, పోస్టర్లూ మొదలయినవి ప్రచురించడం ద్వారా యీ స్కీము గురించి ప్రజలలో ప్రచారం సాగిస్తారు. గ్రామాలలోని ప్రజలకు పనిరోజులలో పని చూపించడానికి వీలుగా తాటి ఆకు, తాటినారనుంచి పలురకాల వస్తువులు తయారు చేసే పద్ధతులను గురించి సాంకేతిక సలహాలు ఇవ్వడానికిగాను జిల్లాకొక గైడ్‌ను నియమిస్తారు.

ఈ ప్రణాళిక ప్రకారం 30 వేల రు విలువ చేసే యీభయి రెండువేల ఎనిమిది వందల గాలన "నీరా" 81,500 రూ చేసే 315 పుట్ల తాటి బెల్లం, 11,250 రు విలువగల అరపుట్టు తాటి పంచదార, కలకండ మొదలయినవి తయారుచెయ్యాలనుకొంటున్నారు.

'నీరా' ద్రవ విక్రయాలను ప్రభుత్వశాఖయే నిర్వహిస్తుంది. తాటిబెల్లం మొదలయినవాటి ఉత్పత్తిని గీతపనివారికి ఒప్పగిస్తారు.

మద్యనిషేధంవల్ల వేలాది గీతపనివారికి జీవనోపాధికి ఇబ్బంది కలిగింది. ఇప్పుడు నీరా ఉత్పత్తిని, తాటిబెల్లం ఉత్పత్తిలో కలపడంవల్ల వారందరికీ చాలా సహాయం జరుగుతుందని నేడొక ప్రభుత్వ ప్రతినిధి అన్నారు. సాంకేతికంగా తగినశిక్షణగాని సహాయసహకారంగాని అప్పుడిప్పుడు వారుచేసేపనిని లాభం చేసే యేర్పాటు లేకుండా తాటిబెల్లం తయారుచెయ్యడానికిగాని లేక 'నీరా' ఉత్పత్తికిగాని రాష్ట్రమంతటా గీతపనివారికి అనుమతి ఇవ్వడంవల్ల ఈ సమస్య పరిష్కారం కాదు. మద్యనిషేధ విధానానికి యెట్టి ప్రమాదమూ రాకూడదు నేముఖ్య విషయాన్ని దృష్టిలో పెట్టుకొని, నీరా గీసేచోట, నమూనా నీరాభవనాల లోనూ అజమాయిషీకి తగిన కట్టుదిట్టాలను ఏర్పాటు చెయ్యాలి. ఈ స్కీము ఇంకా విస్తృతమయ్యే అవకాశం ఉన్నది. కేవలం 'నీరా'ను అమ్మడానికేకాక, తాటిబెల్లం మొదలయిన వాటికి విక్రయసౌకర్యాలు ఏర్పాటు చేసే ఉద్దేశంతో నీరాభవనాలను ఏర్పాటుచేస్తారు. తుదకు ఆర్థికంగా ఇవి స్వయంపోషక కేంద్రాలు కాగలవు. ఈ ప్రణాళికను అమలుజరపడానికి అవసరమయిన సాంకేతిక నిపుణులు ఇదివరకే రాష్ట్రప్రభుత్వోద్యోగాలలో పని చేస్తున్నారు. ఈ ఉద్యోగులకు స్వల్పకాలిక శిక్షణఇచ్చే తరగతులను ఆగస్టులో ఎక్కడో వీలయినచోట బహుశా వానలు తక్కువగావుండే రాయలసీమ జిల్లాలలో ఏదోఒక జిల్లాలో ఏర్పాటుచేస్తారు.

ఈయేడు ఈ ప్రణాళికకు అయ్యే ఖర్చులో సగం కేంద్రప్రభుత్వంవద్దనుంచి సబ్సిడీగా లభించవచ్చు.

తాటిచెట్లనుంచి పలువస్తువులను తయారుచేయించే శాఖ ప్రధానాధికారి కార్యాలయం అభివృద్ధిశాఖ కమీషనరు కార్యాలయానికి అనుబంధంగా కర్నూలులో వుంటుంది.

## క్రీడారంగం

### ఆంధ్ర రాష్ట్ర ఫుట్‌బాల్ జట్టు

### వివిధ ప్రాంతాల్లో ఎగ్జిబిషన్ పోటీలు

రాజమండ్రి, జూలై 8: ఈ నెలలో మద్రాసులో జరిగే నేషనల్ ఫుట్‌బాల్ చాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొంటున్న ఆంధ్రజట్టుచేత ఆంధ్ర రాష్ట్రంలోని కొన్ని పట్టణాల్లో ఎగ్జిబిషన్ ఆటలు ఆడించటానికి నిశ్చయించబడ్డదని రాష్ట్ర ఫుట్‌బాల్ సంఘ కార్యదర్శి ఎం. వి. కృష్ణ గారు తెలియజేస్తున్నారు.

ఈ దిగువ పేర్కొన్న తేదీలలో ఆయా ప్రాంతాల్లో ఆటలను అక్కడ పేర్కొన్నవారు నిర్వహిస్తారు.

జూలై 15-రాజమండ్రి-దేవత రామమోహనరావుగారు, 16-విశాఖపట్నంవి. సత్యనారాయణగారు, 17- కాకినాడ, డి. అప్పారావుగారు, 18-విజయవాడ-టి. నారాయణరావుగారు, 19-గుంటూరు-వై. బాలకృష్ణమూర్తిగారు, 20-కర్నూలు-మీర్ మహమ్మద్ అలీ, 22 - గూడూరు - డా॥ ఎస్. రామచంద్రరావు.

నేషనల్ పోటీలలో ఆంధ్ర జట్టు తొలిపోటీ జూలై 25 న బీహారులో జరుగుతుంది. పోటీలు 24 న కార్పొరేషన్ స్టేడియంలో ప్రారంభమవుతవి.

### సాయుధబలాల చాంపియన్‌షిప్ పోటీలు

జులై నెల 9 వ తేదీనుంచి మద్రాస్ కార్పొరేషన్ స్టేడియంలో భారత సాయుధబలాలఫుట్‌బాల్ చాంపియన్‌షిప్ పోటీలు జరుగుతవి. లీగ్ పద్ధతిమీద జరిగే ఈ పోటీలలో మూడు సైనిక ప్రాంతాలు, విమానదళం, నౌకాదళాలు పాల్గొంటవి.

రేపు ఈస్టర్న్ కమాండుకూ, సదరన్ కమాండుకూ పోటీ జరుగుతుంది.

### పాకిస్థాన్-డెర్బిషైర్ క్రికెట్

డెర్బీ, జూలై 8: నిన్న ఇక్కడ డెర్బిషైర్‌తో ప్రారంభించిన క్రికెట్ పోటీలో నేడు పాకిస్థాన్‌పై చేయి అయింది.

మొదటి ఇన్నింగ్స్-పాకిస్థాన్ 317 డెర్బిషైర్ 176 జుల్ ఫికర్ అహమద్ (53 పరుగులకు 5 వికెట్లు);

రెండవ ఇన్నింగ్స్-పాకిస్థాన్ వికెట్ నష్టం లేకుండా 17.

## బియ్యంపై కంట్రోళ్లు రద్దు

(1 వ పేజీ తరువాయి)

ధాన్యాన్ని సేకరించటం గూడా అనవసరమే అయిపోతున్నది. మిగులు రాష్ట్రాల్లోను, తరుగు రాష్ట్రాల్లోను గూడా వర్తకులవద్ద బియ్యం పుష్కలంగా నిల్వవున్నాయి. రైతుల దగ్గరగూడా సేకరించబడని ధాన్యం అమితంగా వుంది.

"ఈవిధంగా సప్లయి విషయంలోను ధరవిషయంలోను గూడా ప్రభుత్వానికి బియ్యం విషయంలో కొంతవిసులుబాటు కల్గుతున్నది ప్రభుత్వంవారు పుచ్చుకోకుండా వదిలిన సేకృతి ధాన్యం ఇక మార్కెట్లకు ఎక్కువగుందని ఆశిస్తున్నాం."



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.